భావింప నెందైన భయ మఱచె యాశ
సమభావముగ నుండ సహజమౌ నాకు
నాశఁ జేకొని భయం బావలకుఁ ద్రోయు
మోదమున ననుమానమును విడిచిపుత్తు.
నీ తలఁచినటు లంత నిజరక్షలేక
దీనమై సోదరి దిగులుపడ దెపుడు.
కన్పడని బలమెంతొ గల దామెచెంత
మఱచిపోయితి వేమొ మానవతి గాదె ?

తమ్ము: బల మేమి ? ఈశ్వరబల మన్నమాట.

అన్న : అగునయ్య యతిగూఢ మతులమౌ బలము
పరమేశుకృప యున్నఁ బడఁతి దనవచ్చు
శీలమే శక్తియగుఁ జింత మనకేల ?
ఉపమింప శీలంబె యుక్కుకవచంబు
ధరియించి తన్వంగి ధన్వమున్ దాల్చి
తూణీరమున వాఁడితూపులను నింపి
గర్వమునఁ దిరుగాడు గట్టురాపట్టి
వలె ఘోరకాంతారవాటులయందుఁ
జొరరాని పలుముండ్లచొప్పలయందుఁ
జేరెత్తఁగూడని పెనుగొండలందుఁ
బ్రాణకంటకమైన బయళులం దెల్ల
స్వేచ్ఛగా సుఖముగా విహరించఁగలదు.

శీలభాస్కరదీప్తిఁ దెలియ వెలువొంపఁ
గ్రాహుఁడు చోరుఁడు కోదెగాఁడైన
కన్నెమానము కలుషకలితముగఁజేయఁ
జాలఁడు ; కన్నెత్తి చాయఁ గనలేఁడు.

ఇంతేల మరుభూమి మృత్యువాసముల
బెస్తలకోఅల భీకరాకార
ముల జాతిగుహలందు ముగుద ధైర్యమున
రాణివలె రేవగలు రాజ్యంబుసేయు
గరువ మనఁ గాదోయి కపట మనఁగాదు
ఏపాపమతియైన నెప్పట్టునైన
మంచులో నగ్నిలో మడులపంకములఁ
పొడగట్టు భూతాలు పోరిఁ బెంత్రకత్తె
పొగరుఁ బట్టినయట్టి బోడిప్రేతములు
పాతాళగృహములఁ బైశాచవృత్తు
లెంతమాత్రముఁ గష్ట మేఁజాలవయ్యొ
సాధుశీలముఁ గన్న సతి మట్టువయ్యె.

విశ్వసింపఁగలేవె విను మెన్నొ పూర్వ
గాధలు నుతియించుఁగా శీలఘనత !
భిల్లభామిని రూపుఁ బ్రీతిగాఁ దాల్చి
కోదండమును దూపుగుమి చేతఁబట్టి
సింహేంద్రవాహిని చిచ్ఛక్తి యెపుడు

కాంతశీలముఁ గాచు ; ఖలుల శిక్షించు.
హృదయంబులో డాఁగి హెచ్చుబలి మిచ్చుఁ ;
జులుకుఁజూపుల సత్తి చూడ ఛీత్లి
దుర్మతి సాధులకు దూరమున నిలుచు
వనముల రాణియై పాలించు గౌరి.
సత్తి యిచ్చినశక్తి సాయమై యుండ
రక్తి సీతను బట్టు రావణాసురుని
ముల్లోకములనేలు మూలబల మడఁగ
సామజసుతుఁడుగాఁ జచ్చె యుద్ధమున.
నీచకిరాతుండు నీటుకాఁ డాఁచు
దమయంతి చూపులో దగ్ధమై పోయె ;
కేసరికి సరియైన కీచకునిశక్తి
రమణి ద్రౌపదిఁ బట్టి రాళ్ళపాలాయె.
సత్యవంతునిఁ గొంచు సమవర్తియేగఁ
బొంచె నొకచోఁ బెట్టి పొలఁతి సావిత్రి
భక్తియుక్తిని ధర్మవాదంబు సల్పి
యంతకుని మెప్పించి యందె వరములను
విభునితో సుఖముగా వెలఁది మనఁగాంచె.

పశుబలం బిటు మంటిపాలౌను జుమ్మ
సత్యశీలముఁ గన్న సతి నెవఁడు ముట్టు ?
నింగలం బొడిఁగట్టి యెవఁడు నిదురించు ?
నిర్మలచరితంబె నిత్యనకుఁ బ్రీతి

ఆశ్చర్య మనిపించి యర్చించు జనము
స్థిరశీలవతిఁ గావఁ జెంతనే దివ్య
కాంతలు పదివేలు కనిపెట్టి యుంద్రు.
పాపములఁ గలఁచి తత్పాలనము గలలఁ
బూతదృశ్యము లిచ్చి పోషించి మనసుఁ
బొంగునట్టులఁ జేయుఁ బుణ్యచరితలకు.

సజ్జనుం డీదివ్యచారిత్రకథలఁ
బఠియించి యుత్తేజ భావంబు వడసి
నిత్యయుక్తినిఁజేసి నిజము గనఁజాలి
పరమాత్మ క్షితిలేనిపదముఁ జేపట్టు ;
ఖలుల కసాధ్యంబుఁ గనలేరు పరులు
మోహాబ్ధిలోఁ జిక్కి మోసపోయెదరు ;
దుశ్చరిత్రంబులు దుస్తంత్రచలిత
దుర్మదవిక్షేప దోషంపురుచులు
కామవికారంపుఁ గల్మషంబంత
హృదయాంతరంగముల నేపుగాఁ జిమ్మ
నాత్మని స్తేజమై యంధమైపోవు
దేహవాసనపోదు దెసపసచింత
దేవధామంబన్న దివ్యగుణశక్తి
మది విస్మరించును మలినంపుఁ బ్రోవు
విషయగర్తము త్రవ్వి స్వీయనాశంబుఁ
గోరి దుర్మతి యందుఁ గూలి చెడిపోవు.

తమ్ము: పరతత్త్వభావంపుఁ బరిమళశ్రీలు
రసవార్ధిలో ముంచి రక్తి గట్టించె
నడి మూఢుఁ డన్నట్లు పరుషంబు గాదు
భారతీమృదుగీత భాగ్యంబుఁ బోలు
అమృతమయభక్ష్యంపు టతులంపు విందు
నత్యంతముం గొన్న నధిక మనుమాట
లారాజ్యమున నెప్పు డనుట వినరాదు

అన్న: (వినుట నభినయించి)

విను విను విందుగా వినఁబడె శ్రుతికి
పదపూతపాతంబు పవనంబుఁ గలఁచె.

తమ్ము: ఏ నట్లె తలఁచితి నేమి గానోపు ?

అన్న: ఎవ్వఁడేఁ గానోపు నీకానఁ దిరుగు
మనవలె దారి తార్మారైనవాఁడు
కానదరి నివసించుకాఁపు గావచ్చు
దొంగయే కావచ్చు దోపిడికి వెడలె.

తమ్ము: ప్రభుఁడె సోదరి నిందు రక్షింపవలయు
సామీప్యవర్తియై నడి తోఁచఁబడియె
ఖడ్గంబు చేఁబట్టు ! కాచుకోవలయు.
పల్కరించెద స్నేహపాత్రుండె యైన
సరిగూడి మనతోడఁ జనవుమెయి నుండు
కాకున్న స్వీయరక్షణ యన్న ధర్మ
కార్యమున నీశుఁడే గలఁడు మనపట్ల.

( ఇద్దరి వాక్యము )

గొల్లవేసము నూని గూఢచరితమున
మెల్లగా మావెంట మీఱి రానేల
ఎవఁడవో మాటాడ కిటు రాకుమోయి
దరి రాకు మాఖడ్గధారలం బడుదు.

ధర్మవు : కంత మెవ్వరిదానో ? గాంచ యువరాజో ?
పల్కు మింకొకసారి పాయు విభ్రాంతి.

తమ్ము : కానోపు మనతండ్రి కర్షకుం డితఁడు.

అన్న : కమ్మపిల్లనగ్రోవిఁ గలియు నీగాన
కళ వినఁ బర్విడు కలికిసెలయేఱు
త్రుళ్ళింతలోఁ గొంత తూఁగి దా నిలుచు ;
ప్రసవమాధుర్యంబు వర్ధిల్లఁజేసె
నిట కీవు మిత్రుఁడా ! యేల వచ్చితివి ?
గొఱియ నొక్కటి మందఁ గోల్పోతివేమొ ?
చినిమేక నేతల్లి చేరనే లేదొ ?
వెలుఁగు పెనుగాలిచే వెలిఁబడ్డదేమొ ?
ఈమాఱుమూలలకు నేల వచ్చితివి ?

ధర్మ : యువరాజ ! లేఁడు నీ కుపమింప సముఁడు
ప్రభున కీవానందపాత్రుండ వయ్యు
మాప్రాణమని నిన్ను మన్నింతుమయ్య
నాగొఱ్ఱె నామేక నా కున్నధనము
సర్వంబు పోయినన్ శాంతిఁ గోల్పోవ;



నీకార్యాధారమున కివి యేటిసాటి !
అగుఁగాని చూడుమమ్మ యతిపూతచరిత
కన్నె విడిపోవంగఁ గారణం బేమి ?
అన్న : అతివిషాదముఁ గూర్చె నయ్యా విన్పింతు
మాతప్పు లే దిందు మాత్రమాత్రంబు
గాదు ! కోల్పోతి మీకాననంబంటు
మాసోదరి స్నేహము మార్గంబుఁ దప్పి.
ధర్మ : పోయెనె విధి కిట్లు ? పుణ్యహీనుండ !
నాభీతి నిజమాయె నాబాధ హెచ్చె.
అన్న : భయమందు పని యేమి పల్కు శీఘ్రముగ.
ధర్మ : చెప్పెద వినుమయ్య చిత్త మిచ్చి.
దివ్యభారతబోధ తెలియఁ గన్నట్టి
ఋషితుల్యులౌ కవుల్ కృతులందుఁ బల్కు
బేతాళవటు మన్నుఁ బ్రేతంబు లన్న
నరకలోకం బన్న నమ్మకము లేక
యజ్ఞాని విశ్వాస మందుంచకున్నఁ
గలవయ్య భూతముల్ కల్ల లనఁగాదు
నమ్మలేకుంట యంధత్వమును మించు.

ఏవిస్తృతారణ్యమే వాసగృహము 690
గాఁ గుజచ్ఛాయలఁ గనరాక దాఁగి
కాముండు నివసించి కడుఁ గ్రూరుఁ డగుచు
జనుల మోసముచేసి జయపతా కెత్తు

నిండైనవిషపాన మిచ్చి రోఁగొనును.
మనుజభావము వీడి మనఁ బశువులట్లు
పశుత మోమునఁ దాండవముసేయ జనుఁడు
జడత రూపముఁ దాల్చునరుడెఁ జూపట్టు ;
సికొంపఁ బశువుల నే మేపుచుండి
క్రిందిలోయఁ గామక్రీడలం గాంచి
సత్య మేఁ గనుఁగొంటి శ్రద్ధగా వినుఁడు !
రాత్రు లీలోయలో రక్కసులమూక
తోఁ గూడి కాముండు దుష్టచేష్టితము
లెన్నెన్నొ వెలయించు నెదొ మాయఁజేసి
పొట్టిఁ వెట్టినయట్టి తోఁచేళ్ళపోల్కి
తేళ్ళఁ గొండిన పులుఁగిలఁ దలపింపఁ
వనవారితోఁగూడి పటము మార్మ్రోఁగ
బొబ్బ లార్భాటముల్ భువి దివి నిండఁ
గాఁజేసి మనుజులఁ గంపిల్లఁజేయుఁ,
గుంభముల్ పోయించి పంకముఁ జిమ్మి
మాయమూలలయందు మారెమ్మఁ గొల్పు

నభిచారహోమంబు లతిప్రీతిఁ గూర్చుఁ ;
చెలియ కేమార్గమునఁ దిరుగాడుమనుజ
మత్స్యములఁ బట్టు బల్మాయలం బన్నుఁ.
ప్రొద్దుపోయినదాఁక మునిమాపు నేఁడు

మంచుగ్రమ్మినవీట మంచ మెక్కఁగను
వెలమేటిగానంబు చెవి సోఁకినంతఁ
ఐద మొందు మైమఱచి పాడుచున్ సమయ
మెంత వెళ్లెనో కాన నే నుంటిఁ గాన
భావభంగాపర్తవశుఁడనై పడితిఁ
గనుమూయనే వంతఁ గలకలం బాయె,
భూరుహంబులనుండి దొబ్బు లేతెంచి
గాలి యంతట నిండి గగ్గోలుపఱచె
నంత నాశ్రుతిపుటము లటు ద్రిప్పి వింటి
నాశ్చర్య మగునట్టు లాఁగె నాగోల.

నీలితెరమాటున నిలకడ లేక
కలఁగి పర్విడునశ్వగతి నోర్పుమాలి
నిట్టూర్పు లెసలించు నిద్రాధిదేవ
తకుఁ గొంత విశ్రాంతి దక్కె, నశ్వములు
భయ మింత డించి విహ్వలతఁ బెడఁబాసె,
నీశాంతి యొకనిమిష మే నిల్వఁ గంటి.

ఇంతలో మృదులమై హృదయంబు లాగు
గీతంబు వినవచ్చెఁ గిన్నరియె పాడె
నన్పించె, ఘనసార మాయన్న తావి,
యత్తరుబట్టియం దావికి పోల్కి
వాయుగోళం బంత వ్యాపించి నించె ;

శాంతమే యిట్టి యశాంతిఁ దాఁ గాంచి
తనతత్త్వమున్ వీడి తథ్యముగ నట్టి
చాంచల్యమునకుఁ దా సాన మిదెనేమొ ?

శ్రుతి విచ్చి వింటి నా శుభగీత మపుడు
మృత్యుముఖజీవి కమృతతుల్య మద్ది
ఆగానమాధురి యాకలస్వనము
గుర్తుపట్టితి నంత గుండె ఝల్లనియె
మహనీయగుణరాశి మర్యాద కిల్లు
మదుసోదరి యంచు మేనెల్ల వడఁకె
భయము విభ్రాంతియున్ బలసె నస్పష్టై
నతిదుఃఖ మటు నన్ను నాశ్రయించినది
ఆశ్చర్యమున నుడుక యట్టె నిలిచితిని
అసహాయురా లామె యనిపించె నాకు.

రమణి గీతం బట్టు రక్తిగాఁ బాడి
ఘోరవిషజాలంబుఁ గూడినసుఁ గనుచు
జపముకల్మినిఁ బర్వ సాఁగితి నంత
మైదానముల నెన్నొ మైమఱచి దాటి
పరిచయవశమైన బాటల నడచి
సందులు గొందులు చాలగా మీటి
శ్రుతుల నాపాటదే సూటిగా నంచి
పొంచి కాముండున్న పొద చేసులోన

(కలసి తామునిజాప గాంచనాకలవు)
నేమని తెల్పుదు నింతి యాహారాము
తో మాటలాడుచు దొంపరగ మిమ్ము
గూర్చి యడుగుచునుండె గొల్లడని చేరి ;
ఆయాస మంతయు సడియాస యయ్యె
ననహాయ, ముద్దరా లధములచేత
నేపాట్లు పడుచున్న దేమొనో యంచు
నిలుపజాలక యొక్కనిమిషమున జాణ
వేగమున నిట వచ్చి వినుడు మిము గంటి
నతివ క్షేమమ్మెనో యటుమిడ నెఱుగ.

తమ్ము: విసి, మబ్బు, వానలు, నిర్దయులు గూడి
ముగుర రేకమై యొక్కముదితమానంబు
దోచుచుప బూనిరి పురుషసింహులు ;
అసహాయురా లన్న నయిన నేమంటి
భయ మెంపు కంటివి బదులాడ వేమి ?
అన్న: అగునయ్య యిపుడైన నట్టె పల్కెదను
నిస్సంశయంబుగా నిలుతు నద్దాన
విశ్వసించినదాని విడువ నెన్నటికి ;
నాపైంద్రజాలికు నదలింపు లన్ని
వానిదౌష్ట్యం బంత వ్యర్థమని తలచు.
దురదృష్టమును దిట్ట దుర్బుద్ధిమతము ;
ఏమొనో యనుశంక కిట దావు లేదు.

మూర్ఖత యసఁబోకు ముమ్మాటి కిదియె !
దుర్నీతి యెల్లపుడు దోషదూషితము
సాధులఁ బీడించు జయముఁ గనలేదు.

ధర్మ మెదిరెన శక్తిఁ దలఁప నాశ్చర్య
మగుఁగాని సాధుల నంత జానిసలఁ
గాఁ జేయ వశమౌనె ? కష్ట మెంతైన
సుజనుల శోధించి శుభ మిచ్చుఁ దుదకుఁ
దనదౌష్ట్య మెంతయును దన్నె బాధింపఁ
దాఁ ద్రవ్వుగోతనే తాఁ గూలు శఠుఁడు !

దుష్టులకు సాధులకు దుర్ఘటము మైత్రి ;
యత్న మెంతయు వ్యర్థమైన దుష్టాత్ముఁ
డనిలవశమునఁ గూడి యడరు నామేఘ
పంక్తులసాంద్రత భాస్కరుం గప్పఁ
బ్రతిహతి నాజలదపటలంబుఁ దూలు
నటువలె వర్ధిలు మాయు నతిహీనుఁ డగుచు.

దీనికిం దప్పిన స్థిరఖగోళంబు
క్రుళ్ళినగ్రుడ్డందు ; కొండలన్నాక
యెండుటాకులమీఁద నిలగట్టి రందు
బ్రహ్మాండభాండములు పగిలిపోకున్నె ?
ఉదధు లేడును గలిసి యొక్కటై పోవె ?
కానిమ్ము రమ్మోయి ! కదలిపోవుదము.

ఈశ్వరధిక్కార మిట్టు లెప్పుడుఁ ౮౦
చేయఁగాఁ జన దనుజ! చెనఁటి యామ్రేడి
జాలికుతంత్రంబు సమయింపఁజాలు.

వైతరణీనదీపతిత దుర్గాతి
పాపరూపులు క్రూరపక్షిసంతతులు
చుట్టి కొల్లఁగనిమ్ము శోధించివానిఁ
పాతాళమునకైనఁ బట్టి బంధించి
చెలియను రక్షింతుఁ జేజిక్కనీయ
మొలకు నటుగాకున్న ముంగురుల్ పట్టి
కడికండలుగఁ గోసి కాకిగ్రద్దలకు
బలియిత్తు భూభరము వాసిపోవంగ ౮౧

ధర్మ : అయ్యో! యేమందు సాహసికుఁడవె యైన
సిద్ధి మిచ్చోట నిష్పహాయంబు.
సామాన్యసాధనాల్ చాలవీపనికి
నీమాయ మాయింప నితరముల్ వలయు.
కుంచెనాడించెనా కూలుఁ గిల్బిలిమి.
అంగముల్ ముద్దమై యాకృతు లడంగు.

అన్న : అటులైన నీ వెట్టు లామాయలానిఁ
గడిసి యీవార్తలఁ గని చెప్పనాయెఁ
ధర్మ : కన్నెమానముఁ గావఁగా నుపాయంబుఁ
బన్ని నామది కొక్కటవ్యుండు లోఁచె; ౮౨

సుమకుండు సామాన్యునోజఁ జూపట్టు
నైన నేర్పుగలవాఁడన్ని దోషముల
శక్తి బాపఁగఁ గాంచి సామర్థ్య మంచె
మిత్రుఁ డాతఁడు నన్ను మిగులఁ బ్రార్థించి
పాటలఁ బాడించి పడసి సంతృప్తి
మృదువైన పచ్చిక మెయి వాల్చి వినుచుఁ
దన్నుఁ దా మఱచి యద్దానికిన్ మెచ్చి
తోలుసంచిని విప్పి దురవగాహంపు
దోషములఁ బదివేల నోలిఁ బేర్పెర
నద్భుతంబు నమోఘ మైనశక్తులను
చెప్పి యందున నొక్క దివ్యమూలంబు
మహిమఁగలదనియంచు మాయ మాయించు
శాక నల్లనిదంచు నందుఁ గంటకము
బంచును నద్దిచే యన్యదేశముల
బంగరుపూ ల్పూచుఁ బ్రసవింప దిచటఁ
దెలియఁజాలరు దానిదివ్యమహిమలను
బంపులుపెకలించి పొద్దువడఁజేయు
నష్టుచే నున్న యాపాశుపతము
కన్న రక్షణయిచ్చుఁ గలిమి గలదంచు
నచె సుదర్శనమంత యలవి కలదగుట
నాపదలఁ గాపాడునని నచ్చఁబల్కి
మాయలఁ దోలఁగించి మాన్పు రోగముల
ఘాతాలఁ బోఁద్రోలి పూన్చు సౌఖ్యముల

వని తెచ్చి నాకిచ్చె నది నాఁడు నేను
నుంచనిమ్మని సంచి నునిచి దాఁచితిని ;
అద్దాని యవసరంబాయె నిప్పటికి
నన్నింతసత్యమని యనుభవం బాయె
జానుగ నప్పెల్లఁ జని చూడ నాపెఁ
గుమ్మరపుర్వెల్లు గూడి కట్టమను
నంటుక తా వచ్చిన ట్లెను మాయ
వారలఁ జొచ్చినన్ దప్పిరాఁ గంటి.
ఈయౌషధి న్వెంట నిడుకొన్న మీరు
పుట్టెఁడుబలి మున్న ముట్టి కోటంత
వానిఁ జూచినతోన వ్రైఁబడి తన్ని
గాజుగిన్నెలఁ గొట్టి కలమచ్చ మెల్ల
నేలపాలుగఁజేసి నేర్పునన్ వాని
మాయదండము గొనుఁడు మలఁగు నాపదలు
తోడివారలఁ గూడి ధూర్తుఁ డామీఁద
నట్టహాసముఁ జేయు నలుక పుట్టించు
నగ్నిపర్వతమట్టు లనిపింప మంటఁ
జూపించి పొగలెగసి చుట్టు ముట్టంగఁ
గల్పించి పదకుఁ దాఁ గన్మొఱఁగి యార్చు
ధైర్యమున నిల్వంగఁ దలఁగు నీచుండు.

అన్న. దారిఁ జూపుమ గొల్ల ! తత్క్షణం బీవు
వెన్వెంట వత్తుము వేవేగఁ జనుమ

దివ్యకామిని కేలఁ దిరముగా డాలు
పూని నడువఁగఁ దోఁచె మున్ముందు మనకు.
(ముగ్గురు నిష్క్రమింతురు)

### 3. దివ్యోపవనము.

(ప్రవేశము - కాముఁడు, సత్య.)

కాము. అతివ ! వేవఁగఁబోకు మాజ్ఞ యిది నీకు
కూర్చుందు మోహాంత ! కోపపడఁబోకు
రవ్వంత రుచి చూడు రాజ్య మేలించు.

ఈవంత మొక్కమా టేఁద్రిప్పఁగానె
డాబొమ్మ పాదువు రమణి ! నీ విపుడె
చొరరానివనములోఁ జొచ్చి యూర్వసియు
తీవత్రై పోయె నాతీరుగా నిన్నుఁ
బాదపంబవుగాఁగ బంధింపఁగలను
మంత్రశక్తుల కెందు మాఱున్నె యబల !

సత్య. మూర్ఖ ! ప్రేలకు మోరి ముట్ట నస్తరమె ?
స్వేచ్ఛామనోవృత్తి జనక నీ కగునె ?
భౌతికశరీరమున బంధములు నీవు
మాయల నొంగాక మందభాగ్యుఁడవు.
జయము ధర్మమె కాంచు సాక్షి యీశ్వరుఁడె.

కాము. చురచురఁ జూడంగ సుదతి ! యేమాయ
బాధ లేమాయనే పడఁతి నీ కిపుడు

కోపతాపము లింపఁ గూడవే యింతి !
స్వప్నమందేని దుఃఖవార్తఁ గన వతివ !
యౌవనోద్రేకమున నడచు నుత్సాహప్ర
పంచసువ్యాప్త సుఖభావమాలికల
కందు విచ్చోట నొకరికి ! యెల్లప్పుడు ;
కాలమున దీవ యుత్కళికలం బొడఁగు
నోజన్ దరుణరక్త ముప్పొంగె నింతి !
తొలుత నీయమృతబిందుయుతపానంబు
స్వచ్ఛమైన యుపాధిఁ జల్లనిపరిమళ
ములఁ బిల్చుచున్నది ముదమునన్ గ్రోలు
మానాఁడు హరిసుధ నంది దివ్యులకు
నీయఁడే యటువంటి నెంతయో ముదముఁ
గూర్చుఁ దాపము మాన్చుఁ గోర్కె లందించు
మృదువైన యంగముల్ మిగుల శోషిల్లె
క్రూరతఁ దనులతఁ గుములింప నేల ?
క్రౌర్యమును బాటించి గాసిల్ల నేల ?
పడఁతీ ! ప్రకృతి యిచ్చు భాగ్యమంతయును
దాఱుమాఱుగఁ జేసి తప్పఁ జూపెదవు
మనుజదౌర్బల్యంబు మను దానఁ గాదె ;
పాటుపడ భోగంబు బాధపడ సుఖము
పగలెల్లఁ బనిసేయ వలయు విశ్రాంతి.
అతివ ! నీతాపంబు లడఁచు నీమధువు.

సత్త్వ. అందఱయు నసత్యంబె యగు మోసకాండ!
సత్యమూడంబ పలుచు సద్వస్తు వెదలి
నడచు నీదుహృద్వ్యగ్రమం దసత్యంబె :
నీహారియు ల్లంటి నివాస మిదియె ?
ఇదియె నీ విధురక్ష యింతులకు మూర్ఖ!
ఇష్టవిక్కరరూపు లివింతదృశ్య
ములు నీయఁజాలునే ముక్తికాంతలను ?

అపహాసమయ్యఁడె నన్నరసి పాలించు
నీయింద్రజాలంబు నీమోసంబు
సాధువేషము నూనపాఁగె నింతకును,
నమ్మకముఁ బుట్టించి నన్నిటకుఁ దెచ్చి
పశులఁ బ్రతారింప వలఁతిపానకముఁ
ద్రావించి మతి చెఱుపఁదరమె? నీచుండ!
అగుఁగాక యమృతమె యతిపవిత్రంబు,
దుష్టుఁడవు నీకరదూషితం బగుట
ముట్టి రుచిఁ జూడఁగ మూర్ఖ! నే నొల్ల.
సాధుసంగతిఁగాక సద్వస్తు వున్నె?
సత్త్వ మేదిన దాన స్వాదుత్వ మున్నె?
మితభుక్తి గలషత్తు మెచ్చు దారసము.
కాము. శుభదంబులై నట్టి శ్రుతు లున్నవంచు
మనువు చెప్పిన ధర్మమార్గ మటంచు
ఋషులు దెల్పినయట్టి ఋజుమార్గమంచు

నియతి, మితి, యింద్రియనిగ్రహం బంచుఁ
బాటాకులన్ వ్రాయఁ దథ్యమని నమ్మ
నరునిమూర్ఖత గాక న్యాయ మంటన్నె ? 99
ప్రకృతి గర్భభరంబు శ్రమనాక దాల్చి
వితరణశీలమై వెల్లిరేకుండ
విశ్వమంతయు నిండ విరితావిఁ జిమ్మఁ
బాడియున్ బంటయున్ బశువృష్టి గమర
జలజంతుసంతతి జలధి నిండార
నేమని ప్రసవించె నేల వెదఁజల్లె :
ఆనందమును గూర్చి యభిరుచి వింత
భేదముల్ గనిపట్టి ప్రీతి మన కందఁ
జేయ నెంచియెకాక శ్రీలు నిష్ఫలము.

పట్టుపుర్వులు కోట్లు పనివిని మృదుల 100
మౌ పట్టువచ్చని యంగకప్పు వడకఁ
గాంచుట సుతులజోక యలంకరింప.
ఏపూవు నేకొదువ యింతయున్ లేక
స్వీయసంతానంబు పెందఁగా సుఖము
పూజార్హమౌ సర్వభోగంబు లీయఁ
దనగర్భగోళమున దాఁచె నవనిధులు,
రత్నరాసులు సాకె రక్తి గర్భమున ;
ఇంద్రియనిగ్రహం బెంచి లోకంబు
కూరాకు సూపంబుఁ గూడుగా మెసవి

తెంసెటితేటలన్ దీర్చి సాహంబు
ముసుకబట్టిలఁ గట్టి మురిసిపోవంగఁ
గలిసెరి సగమైనఁ గాంచఁగా లేము.
కన్న దిఁతయు సెగటుగాఁ దోఁచు మనకు.

పరిపూర్ణదానంబు పాటింపకున్న
నంసుఁ గృతఘ్నులమన్ బిరుదు మనకు ;
స్తుతిపాత్రు నుతియింప సూక్తులే గనము ;
కాసు వీడఁగలేని కసిలోభిప్రభువు
సేవింపుదాసుని సిరి యబ్బు మనకు,
సిశుసంతానంబు హీనగతిఁ గాంచుఁ,
ప్రకృతి వనథారమున్ ధరియింపలేక
యడఁగంగ మనప్రబుసుకు అతిభారమౌను.
ఆడసూపిరి సెడ నిరర్థకపుఁబంట
నేల క్రుంగఁగఁ జాల నెగడు సస్యములు,
ననిల మంథతమీబ నడచు ఖగతతులు,
పాలించుప్రభు వేదఁ బసువు మితిమీబుఁ,
గడలి నిండియుఁ బొంగఁ గ్రాల్ రత్నచయము,
రెత్తనివ్రజాలె యేవి తారలయి
యూఅక బడియుండు నుదధినెన్నడుచు,
లోలోనఁ దమకాంతి లుప్తమై చనఁగఁ
బెంపంది కొంచమై విధిగ నిను మోముఁ
దేఱిపారఁగఁజూచుఁదేలి సిగ్గేది,

నారాజమకుటముల రాజిల్లరవ్వ
లోఁతలు వగులంగ సువధ మెఱు వెం:

అతివ! విను నామాట లడఁచు పిపాస:
శీలమని వాదించి చెడి మోసపోకు.
అందమనఁగా ప్రకృతి కనునాట మదియు
మాయుచుండఁగవలయు ; మహిఁబూవ్వుఁబగసు.
అందలియాధిక్య మగుఁ బరస్పరము
పాగించి భోగింపఁ, బరమార్థ మిదియ.
వివిధభోగములందు వెగటున్న దేల?
యుత్తరాలము నాఁట సువిద! నిధనము
కోయుని పూవట్లు కొమ్మనే వాడి
తల వాంచి నశియించుఁ దారుణ్య మెడఁ.
అంగడిఁ బెట్టినను నానందప్రకృతి
రాణివాసముఁ జేర రాణించు నెట్లు?
ఉత్సవంబుల రచ్చ నుయ్యేలల నూఁపఁ
బనితనము భావించి పరులు మెచ్చెదరు.

సంసారపక్షంపుసారు గృహమందె
దాన సంసారియున్ దగునామ మప్పు;
చెన్నొంది విరుసుతా చెక్కుటద్దములు
వసలేక కళ డిందువడు దేహకాంతి
యింట దాసిగ నుండ నీదౌనుగాక

నూలు వడకుటకైన నుదుటివ్రా లగుత ;
పసతేటి బంగారుచాయ గల మేను
తుమ్మెద బారుతోఁ దులఁదూఁగు వేణి
శిత కాండజాలమ్ముఁ జిమ్ముకన్దోయి
యంటి మీటిన విచ్చు నధరబింబంబు
భాగ్యముల కిక్కయైన వరువంపుఁదోడు
సంసారబంధముల నరిగట్టఁ దగటు.
అర్థాంతర మగు నీయందచందముల
కారుణ్యవతి నీవు తలపోసి చూడు.
తగుమానిసిని వినఁ దగదె నామాట ?

సత్య :- (తనలో)

నిరయవాతావరణ నికటదేశమున
నసువుగా నెటు మాటలాడంగ నాకు.
బాహ్యాదృష్టులఁ గట్టి వశ్యమైనట్టు
లపధర్మసూత్రముల్ న్యాయమని పల్కి
యంతఃకరణవృత్తు లాగఁగాఁ దలఁచె.
పాపి ప్రత్యేకించి వాదానుకూల
మైనయుపపత్తుల నందముగఁ జెల్ప
నాగర్వ మడఁగంగ నప్రతిహతంపుఁ
బ్రతివాదములు సల్ప బల మెంతొ యుండి
ధర్మ పూరకయున్నఁ దప్పు లోకములు.

(ప్రకాశముగా)

పూఁతపంటవలంతి పూర్ణగర్భంపు
ఫలము తెగతినఁగ సుతు భాషించె నంచుఁ
బళువ ! ప్రకృతి దూఱ భావ్యంబు గాదు
సుతుల సౌఖ్యమె కోరు సుజనని యట్లు
నియమబద్ధముగాఁగ నిజజీవనంబు
గడుపుధన్యులకుఁగాఁ గల్పించె ఫలము.
ధనమదకామినీదత్తసురభోగ
సంతతి పోకలై చని యచ్చటచ్చట
విషయసుఖములె మెచ్చి పెనుగరువ మూను
నొకరిద్దఱిని మించి యూపు డోలికల.
దారిద్ర్యమున స్రుక్కు ధర్మమూర్తులకుఁ
దగుభాగ మందినఁ దలఁగు భూభరము.
అపుడె ప్రకృతిఁ గన్న యఖిలఫలరాజి
చక్కనియుపయుక్తి సమభుక్తిఁ గాంచు
నపుడె యీశ్వరుఁడందు నభినందనంబు
లపుడె సుతు లందినటు లానందమందు.
తిండిపోతులు తఱుచు తిని భక్ష్యవితతి
స్వర్గమున్ గనలేరు పళుత దము ముట్ట.
విశ్వాసరహితులై వీథిఁబడి జంతు
సమకృత్యములు పూని చవుల కెగఁబ్రాఁకి
నిందలపాల్సేయు నిజమాతృగృహము.
వివరింపఁగల దెంతొ వినుము చెప్పెదను

పలుపేనంతయు వింటి వలదందు వేమొ ?
సతిమానభంగంబు సమకట్టు నెవఁడు
వినరానిమాటలు విన్పించు నెవఁడు
వానికిఁ జెల్పఁగా భారతము గలదు,
కాని యుపయోగంబు కాసంత లేదు.
పడఁతికి శీలంబె పదనైనకత్తి
దానితత్త్వముఁ దెలియ ధాతకేన్ వశమె ?
ఆప్రతశక్తియు నాధర్మపథము
విప్పి చెప్పఁగ నాకు విధియైన నేమి ?
ఆత్మశుద్ధియు దాని కనుపైనప్రతియు
నంతరించినవాని కర్థంబు గాదు.
నీవంటిపాపికి నిర్వీర్యునకును
నీకల్లుకొంపయే నిత్యభోగంబు ;
తెల్పఁగూడదు నీకు దివ్యతత్త్వంబు.
అజ్ఞానతిమిరంపుటావరణ మంది
వికటమగుచాతురి వింతశాస్త్రంబు
భ్రాంతిఁ గొల్పెడు వాదపరికరంబులను,
సమకూర్చి భోగింప సరసుఁడవు నీవె !
మూషలవాదంబుఁ బూని యొప్పింప
బ్రహ్మకైనను వశమె ? భావింపఁ దరమె ?
అయిన యత్నముసేసి యకలంక మపరి
మితమూల్యశీలంపు మేలైనశక్తి
భావింప నాత్మలోఁ బ్రభవించునగ్ని

కీలికామాలలు కెరలి వ్యాపింపఁ
గరుఁగుఁబో వాగుండె కరుణించినట్లు.
పులకరించినయట్లు పుడమి కంపింప
నేలమట్టముదాఁక నీమాంపుకొంప
పడికూల నీశిరము పగిలిపోకున్నె ?

కాయు :- (తనలో)

సతి పల్కినది యంత సత్యమని తోఁచె
నతిలోక మగుశక్తి యదరెఁ బల్కులను
మానవాతీతమగు మహిమ గన్పట్టె
భవమాది గననట్టి భయమాయె నాకు ;
నస్వేద మనిమేష మమరభావంబు
నయినదేహము నిండి వ్యాపించె, మంచు
వలెఁ జల్లనై కంపభాజనం బైన
స్వేదజలపూరంబు చిత్రముగ నిపుడు
మర్త్యత గన్పట్టె : మహి ననసూయ
ముమ్మూర్తులను బాలమూర్తులుగఁ జేయ
నమర లందఱును భయమందినటువోలె ;
సత్త్వంబు వెలయింప సమయంబు వచ్చె,
నతిపటలమును జూడ నవసరం బిదియ.

(ప్రకాశము)

నీయుపన్యాసంబు నిలుపు మోయబల !
నీశుష్కవాదంబు నీనీతిగతులు

మాసంఘనియమముల మర్యాద మీఱె.
వినఁజాల నిఁకమీద వెలఁది ! నీనుడులు
వెఱ్ఱియెత్తినవారి ప్రేలడము లనెద.
పిచ్చిమాటలు మాని ప్రీతి నీరసముఁ
గ్రోల వెఱ్ఱియుఁ గుదురుఁ గుదురు చేకూరు.
ఒకబొట్టు చవిగొన్న నుత్సాహ మొదవు,
దైన్యంబు హృదయంపుదౌర్బల్య మడఁగు
స్వప్నసౌఖ్యము మించు భాగ్యమే యబ్బు.
చిన్నిబుద్ధులు మాని చింత లటు ద్రోసి
తిన్నఁగా బుద్ధిమై దీనిఁ జవిచూడు.

*ప్రవేశము - కవలు*

*(ఆర్వారివాక్యము)*

ఓరోరినీచుఁడా ! యోరిదుర్మదుఁడ !
అబలను నమ్మించి యాగడము సేతె ?
ఈఖడ్గధారల నింతింతఁజేసి
నినుఁ గాకిగ్రద్దలకు నిండుబలి యిత్తు.

*(పరివారముతోఁ గాముఁడు పర్వేడును)*

ఆగు మోరీ పంద ! యతివవలెఁ బాఱి
నీ కెవఁడు బోధించె నీచాతినీచ !

*(తమలో)*

వీనితో మన కేల వెలిఁబడ్డఁజేప
పురుషుఁడే ? కాలికి బుద్ధులు చెప్పె.

(ధర్మదేవత బయల్పడి)

అయ్యయో! విడిచితిరె! యామోసగానిఁ
దప్పఁదలఁచితి రీరు తత్క్షణమ వాని
కట్టి లాగియుఁ ద్రాటఁ గట్టగావలదె?
టాఁగట్టిసంకెలల రమణి పడియుండెఁ,
గట్టెను దలక్రిందుగాఁ జేసివైచి
మాయను సడలించుమంత్రముల్ చదువ
లేవఁగల దందాఁక లేదు కార్యంబు.
అయినఁ బోయినదేమి? అడలఁగా వలదు
స్మృతిఁదగిలె నొకయుక్తి మేలగును మనకు.
అలవడెఁ గిన్నరీధ్యానగీతముల
సమకూడెఁ గవి గన్న సత్యదృశ్యముల.

కల దొక్క కన్నియ కడు సాహసశీల
కన్యభావము చెడదు కాలంబు చనిన
పేరు సరస్వతి; విబుధుని తనయ
ఇల్లాండ్రు విబుధున కిరువురు గలరు.
జ్ఞాన మజ్ఞానంబు సవతులై పోర
జ్ఞాన మిల్లాలగుటఁ జాలలే కంత
గుహలు డొంకలుఁబట్టి గూఢముగ దానిఁ
గూడి కన్నియఁ గాంచి గుప్తముగ సాకె.
అజ్ఞానసతిఁ గూడి యవివేకిసుతునిఁ
గాంచి కష్టములంది గాసిల్లి యంత

ధైర్యమున సతి సుతులఁ దరిఁజేరనీక
జ్ఞానసరస్వతుల సరసకుం జేర్చె.
తనవారి సీక్ష్యాదితాత్పర్యమతుల
సాయమున నవివేకి జననితోఁ గూడి
తండ్రిని రణమందు దయలేక చంపె.

సుఖముగా నేలుబడి సుతునితోఁ గనుచు
నజ్ఞానసతి సవతి నాసరస్వతినిఁ
గట్టించి బాధించి కడకు నిర్వ్వరను
గంగయమునలు గలియు గంగలోఁ ద్రోసె.
నాఁటనుండియుఁ గన్నె నామమున లోనఁ
బ్రవహించునది సరస్వతియంచు నొప్పె.
అతిపూతచారిత్ర యాముద్దరాలి
శీలంబునకు మెచ్చి చెలు లగుచు గంగ
యమునలు ప్రవాహంపుటద్దాల నాగె.
నదిలోనఁ గ్రీడించు నాగకన్యకలు
ముత్యాల ముంజేత ముద్దియను గొంచు
నాగేంద్రుముండటన్ నయమార నిల్ప
నతివపుస్థితిఁ గాంచి యాదరముఁ జూపి
వృష్టిఁ జింతట జాలి వెల్లువై పొంగఁ
జేతఁ గన్నియశిరము స్పృశియించి తనదు
కూఁతుల కిడ నమృతకుండ మందుంచి
యటమీఁదఁ బన్నిట నంగములు దడుప

నింద్రియద్వారముల నిండె నమృతంబు
జీవలత చిగురించెఁ జెలియ జీవించె
నతివ మృత్యువు దాటి యమరత్వ మందె
నంత నదీదేవతాఖ్య విలసిల్లె.
నేఁటికిని గన్నెపై నియమంబు నిల్చె.
మందల మునిమాఁపు మైదానమందు
మలఁగుచు నిచ్చలు మారికాగణము
క్షుద్రభూతముఁ గూర్చు శుభదూరమైన
చేష్టలఁ బసిఁబట్టి సిద్ధమూలికల
సమ్మిశ్రితంబైన సరసజీవనముఁ
జిలికించి పోఁగొట్టు జేజే యటంచు
గొల్లఁడు నుతిసేసి కొలుపు లందించు.
నుతిఁబూని యాగొల్లసుద్దిఁ బాడుచును
నుత్సవము సాగించు నూఁకొట్ట నొకడు.
మల్లెలు మొల్లలు మఱి విరజాజి
సరములు గులాబులు సంపెంగవిరులు
కొల్లలుగ నాయేఁటి గొల్ల లర్పింత్రు.
ఆక్రమకిన్నరీధ్యానగీతంబె
ముమ్మాటికిని దెల్పె ముగుదసత్తులను.
శీలప్రభావమున సిబుగులను బాపు
నమృతధారాప్రవాహంబుగా గీతి
కామధువుఁ జిల్కెడు కంఠంబు నెత్తి
ధ్యానించి పిల్వంగఁ దరుణి వే వచ్చి

సంకెలలు సడలించు సతి లేవఁగల్గు.
కన్నెమానముఁ గాచుఁ గాంతసువ్రతము.
ఆపదలు తరియించె ; ననుభవము మెండు.
అసహాయురా లంచు నడ్డుపడితీరు.
యత్నించి చూచెద నానందగీత
మొకయింత సాయమై యుత్సాహ మీయ.

(గేయము)

అందంపుభారతీ ! ఆగి నీ వున్నచో
టనె యుండి వినుచుఁ గష్టమునాక నాగీత
మున నర్థమును గాంచి ముదమున నిటురమ్మ.
అద్దంబువలె స్వచ్ఛమై స్నిగ్ధమై చల్ల
నగు నలలయడుగునన్ హాయిగా వసియించి
కమ్మతావులఁ జిమ్మ కబరికాభారమునఁ
గలువపూవులు దెచ్చి కట్టి వేణికగాఁగ
నల్లుకొను నిన్ దలఁతు నాలకింపవె, మాన
మనఁ బ్రీతి గాదటే, యల వెండిమలలోయ
వెలసినదేవతవు, వేడెదను భారతీ !
వినుమమ్మ మాముందుఁ బ్రీతిగా నిలుమమ్మ.
ఉదధీశుపై నాన యుంచి పిల్చెద నమ్మ.
వరుణదేవత యిచ్చు భాగ్యరేఖలె యాన

శేషాహిపడగల శ్రేణులే యాన
గంగయమునల మత్తగజయానమే యాన
ఇంద్రుని శతధార యేడేడు వాయువుల్
కృష్ణనీరదగర్భకీలితవిద్యుత్తు
లేటితరగలఁ దూలు నింద్రనీలఁపుఁదమ్మ
సోగలై నాచువలె సుళ్ళఁ దిరిగెడుకురుల్
కలువకాడలఁ బోలు కరపాళికాతతుల్
పద్మశోభలమించు పాదముల్ వదనముల్
భర్మకలశంబులన్ వహియించి జతఁగూడి
జలకేళి సవరించు జలకన్యకలె యాన,
నిసినిసి నీనీట నీతీరములయందు
నచ్ఛంపుమగఱాల నాసీనలై నెఱుల్
చిక్కుఁదీయుచుఁ జూపుఁజిలుకులు వఱపెడు
పాఁపకన్నెల యాటపాటలే యానగా,
బృంద చూపినశక్తి, వేదవతియోగంబు
సీతదమయంతుల చిత్తశుద్ధులె యాన,
పవడంపుసెజ్జ విడి భారతీ! లేలెమ్మ
నీభంగరభసంబు నిలఁగట్టి యొకయింత
మాకార్యమును దీర్చు, మర్యాదఁ బాటించు
విశ్వాస మది యుంచు వేడెదను భారతీ!

(వినవె రక్షింపవే)

ప్రవేశము :- సరస్వతి - సఖులు

(పాట)

సర:- ఏటిపొరి పట్టముగ నేచి పూచినరెల్లు
నీలివావిలిప్రబ్బ నిండారఁ బ్రాకిన
ఏటిపట్టులయందు నీడవలెఁ గదలు నా
రక్ష మిప్పు డాపితిని, రత్ననీలపుసిరుల్
ఘాపిల్ల నుప్పొంగు భంగమాలికలందుఁ,
గమలగంధము లొలయు కలయంపిజల్లులన్
ముత్యాలకంకణాల్ మ్రుగ్గలసొబ గందు
చంద్రికాసారంపు సాంద్రతోరణరాజి,
నవరత్నరుచుల విన్యాసంపుఁదీరు
ప్రతిబింబిత ప్రాంతభర్మకదళీతరు
కాండనిర్మిత రాజగంభీరవాహినీ
పదమున, భద్రముగఁ బంకరుహములమీఁదఁ,
గాలూనఁ గందని కలువరేకులమీఁదఁ
బాపమూనిన గుర్తుపట్ట శక్యముగాక
వచ్చితి, ధర్మదేవతవమ్మ ! నీ ప్రార్థ
నల్ వృథా పోఁజన్నె ? న్యాయమే జయమందు;
పిలిచినపని యేమి వినిపింపు మమ్మ."

ధర్మ : క్రూరమతి యపవిత్రు గూఢతంత్రమునఁ
బశుశక్తి, యవినీతి, బలయుక్తికతన
సతిశీలసత్త్వంబుఁ జైతన్యమాఁగె.

మా ప్రార్థనల్ విని మాయమ్మ యిపుడు
తుచ్ఛుని మాయలఁ దూల్చి నీశక్తి,
కట్టుపీడఁగఁ జేసి కారుణ్యమతిని,
సతిజీవములు నిల్పు జైతన్య మిమ్ము.
సరస్వతి : ఖలతంత్రములఁ జిక్కి కన్నెమానంబుఁ
గావ నాధర్మంబెగా గొల్లవాఁడ !
(ధీరత సతివంక దృష్టుల నునిచి)
తేజస్వినీ ! నన్నుఁ దిరముగాఁ జూడు
పరమౌషధము లివి పావనవిమల
వాహినీగర్భసంవర్ధితకమల
సరససుధామోదసాంద్ర కంకణము
లౌషధప్రాయంబు లడఁచు రోగములు
నీయురఃకుసుమములు నిండఁ జల్లితిని,
ముమ్మాటిదె కరాగ్రములయందుఁ జల్లి
యధరప్రవాళముల నద్దె చిల్కితిని.
అంటఁగూర్చెదురసము లలముకొన్నట్టి
చలువతానసత్త్వల నడలింపఁ జాలి
చెమరుచు చల్లనిచేత నంటితిని;
మాయమంత్రపుశక్తి మచ్చమాసినది;
ఉదయాద్రి సరుణరుచు లొలయుటకు మున్నె
గంగామహాదేవి కాంతకుంజమున
నిల్వ వేగము పోవ నియమ మది నాకు.
(అదృశ్య యగును)

(శారద యటుపోవ సతి యిటలేచె)

ధర్మ :

*(ధ్యానించుచు సరస్వతి నాశీర్వాదించును)*

తండ్రి వివేకంబు తాత సత్యంబు
ధర్మమే శీలంబు తాత్పర్యమతిని
మానివిన్ రక్షించి మహిఁ గీర్తిఁ గంటి.
నీయుపకృతి మఱువనేర్చు నెవ్వాఁడు !
నిండుజీవనవృద్ధి నీ కగుత మెపుడు !
తటము వొంగఁగఁజాలుతరఁగగమి వరల
మంచుమల చఱియల మలఁగి ప్రవహించు
సెలయేటికన్నియల్ చెలఁగి యెగఁబెట్ట
కుండఁ బరిపూర్ణకర మొగి నిచ్చుఁగాత !
వేసంగివెట్టలును వేడిగాడ్పులును
నెఱులు మించిననీదు నెఱికురులచాల్పుఁ
గంపింప శోషింపఁ గాకుండుఁగాత !
శిశిరశరదాపగాజీవకల్లోల
చండోద్ధతుల్ పంకసాత్కృతము గాక
కరఁగినపటికంపుఁగాంతుల నీను
నీజీవనఁపుఁదెరువు నిర్మలం బగుత !
పటికంపుఱాలను బసిఁడిపంకంబు
నేటిదరి నీతరగ లెగఁబోయుఁగాత !
రమ్యహర్మ్యంబుల రాజనగరములు

రమణ నీశిరమున రంజిల్లఁగాత !
ఏలా లవంగలత లీరముల నల్ల
నటనట నీతటము లందగించుతను !

(నళినిఁ జూచి)

కన్నెరో ! రావమ్మ కదలు మతివేగ.
ఈశుఁ డిచ్చినయాఁత యింత యుండఁగనె
యీనరకము న్వీడి యెగిరిపోవలయు
మాయలాఁ డేదైన మర్మంబు పన్ని
యాలసించిన మనల నరికట్టనోపు.
పుణ్యభూమిని మెట్టఁబోవునందాఁక
మాటాడఁగా రాదు మసలఁగాఁ జనదు.
ఈసాంద్రవనభూమి నిరు లేచియున్న
దారిఁజూపుదు, నమ్మ తరలు నావెంట
మీతండ్రి నగ రిటకు మెలఁత యొకక్రోసు
నుండ దీరేయి యట నుత్సవంబందు
సభఁదీర్చి రాజుండ సామంతమిత్ర
బృందము లభినుతులఁ బ్రీతిఁ దెలుపంగఁ
గూడిరి దర్శనముఁ గోరి ముదమంది.
ఒడయని కానంద మొనగూర్చుటకును
నటవిటగాయకుల్ నాట్యపరివేష
ముల్ సల్ప సిద్ధముగఁ బొలఁతి ! తారుంద్రు.
నృత్తగీతములందు నేర్పు లేర్పడఁగఁ

జూచి సంతసమంది శోభి వాటందఁ
చటుకున మనరాక తథ్యముఁగ వారి
ముద మినుమడింపఁగఁబోయి కలియుదము.
నాతిరో ! పద పద నక్షత్రరాజి
యుడువీథి కెగఁబ్రాఁకియున్న నేమాయె
నడిమింట రేవెలుఁగు నవ్యముగ నుండె.

(నడచు)

అల్లదే కనుఁడు మీయానందపురము. 1200
దిశలెల్ల వెలుఁగొందె దీపంబు లవిగో.
ఇదె నగరినటకులనృత్యంబు సాఁగె
మద్యమత్తత వీరు మనరాకఁ గనరు
తొలఁగ మార్గముఁజేతుఁ బోదనే రండు.

(గేయము)

మిన్నకే తొలఁగుఁడు మీయాట చాలు నిఁక
మంచిగొల్లలు రండు మఱియుత్సవమునాఁడు
మీగొల్లసుద్దులు మీతాండవంబులు
మెచ్చనాయెను వినుఁడు మేటైన మృదుగాన
లాస్యనృత్యములకలాపముల రచనాయె.
లలితమృదుపాదకమలంబు లానందగిన 1300
రంగప్రదేశంబు రాజమణి హర్మ్యంబు
నారదనృత్యంబునకు నుద్దియైనట్టి
నీలంపుటుడువీథి నీడైన మగరాల

నిగనిగల్ దగఁజిమ్ము నిద్దంపు నేల్పువరెఁ
బసిరికపట్టిన పచ్చనిబయళుల
నవకన్యకలు సూపు పాటవంబును మీఱు
వాల్లభ్యమును గన్నవార లిటు వచ్చిరి !
మిన్నకే తొలఁగుఁడు మీయాట చాలించి.

*(ధర్మువు తల్లిదండ్రులకుఁ బిల్లల నప్పగించును.)*

"తల్లిరో ! ఇటురమ్ము తమ్ములు నీవు
మీజనని జనకుండు మిమ్మాదరింత్రు."

(పాట)

ఓరాజ ! ఓరాణి ! యుత్సవసమయమున
సంతోషసామగ్రి సమకూర్చి తెచ్చితిని.
చూడుండు చక్కఁగా సొగసైై పెరిగినవి
మూఁడుకొమ్మలు మీకు ముచ్చట యనిపించు
ఉడుకుశోధనఁజేసి యుక్తకాలమునందు
శక్తిఁగాంచియు విభుఁడు సాధించి మెచ్చెను,
శాంతివిశ్వాసంబు సత్యధీతత్త్వంబు
లసిధారపై నిల్పి యచ్చుమని పరికించి
పంపె నీకత కిపుడు పండె నీకోరికలు
సుస్థిరం బగుకీర్తి శుభకిరీటంబులు
శిరమునఁ దాల్చిరి, చిద్రూపు పరిపూర్ణ
కారుణ్యమాలికాకాంతులు వ్యాపింప ;
విషయవినిపాతంబు విధిమీఱుహ్రాదయంబు

జయశీలురకు లొంగెఁ జక్కఁగా నశియించెఁ,
జాటనగు విజయంబు జయజయధ్వనులతో:

(ఆటపాట లాగును)

భరతవాక్యము.

ధర్మదేవత :— ఇపు డబ్ధికడల కే నెగిరి పోయెదను
ఇరులు గ్రమ్మక యెచట నినకాంతి యెసఁగు
నతివిశాలము నున్నతాంతరిక్షమున
నాకల్పసుఖపద మందఁగాఁబోదు.
నందనవనములో నారయం డొకట
గంధర్వకిన్నరకన్యకలు నప్లె
యప్సరోగణములు నందందుఁ జేరి
కల్పకుజములనీడ గానంబునలుప
వీనులవిందుగా వినుచు శ్రమవాయ
విమలవాయువుఁ బీల్తు వేల్పులన్ గూడి.
కుంజపుంజములందుఁ గొమిరెజొంపముల
వాసంతవనలక్ష్మి పరువంబు పొదలె.
సర్వర్తులక్ష్మి తనసారవస్తువుల
నంగడి వెలఁగొనక యమ్మకము నూపు.
క్షుత్పిపాసలులేని సురకాంత లవ్వి
కైకొనక ముట్టక కని యనుభవింత్రు.
మలయమారుత మొలయు మంచిగంధంబు
కమ్మకస్తురితావి గలసి పెనఁగొనఁగ.
ఏపుగా భూజముల నేలాలవంగ

పీయుష లెగఁబ్రాఁకఁ బెరసె నెత్తావి.
ఇంద్రుచాపవిభూతి నెకసక్కెమాడు
నిగ్గు గల్గినపూలు నెత్తావి మిగుల
విరియఁగాఁ దీరముల విధుకరశిశిర
జలసేచనము సేయు సాధ్వి నిర్ఝరిణి.
కాటుకకళలీను గాఢతమాలి
రారమ్యవాటికల కాళిందివాలు
కాతీరములయందుఁ గంసాదిక్రూర
రాక్షసులఁ దునుమాడి రక్షించి జనుల
కృష్ణుండు పలుమాఱు క్రీడించె నెచట,
కలికి రాధికఁబట్ట కన్నొమ్మఱఁగిపోయి
శ్యామతమాలికాచ్ఛాయలు గప్ప
యమున నల్లనినీట నగుపడకయున్న
నెందెందు రాధిక యేడ్చెఁ గరుణముగ,
నాతావులను దాఁటి యాగకే పోదు.
వారితనయుఁడు రతిప్రాణనాథుండు
స్మరుఁడును మారుఁడు మనసిజుఁడు నాఁగఁ
బేర్వడ్డ పూవిల్తు పెద్దఱిక మంత
నీశుకోపాగ్నికి నింధనముగాఁగ
నాతి నదులే పొంగ, నగములే కఱఁగ
బిట్టు రోదనసేయ విని జాలిఁజెంది
దేవత లాజంట దివ్యతన్ బొంద
దీవించి కలిపిరి దిశలు వెలుఁగొందె.
యౌవన మానంద మను కవల లంత

మారునకు రతికిని గుమారులై రెలమి !
పట్టినకార్యంబు పండె శాంతముగ.
పర్విడుదు నెగురఁగలఁ బంటవలంతి
కడలంది మీఱిపోఁ గలను ద్రుటిలోన,
నింగి నేలయు నెచట నిలిచెఁ గౌఁగింట
నట కేగి మొగిళుల నంటిపోఁగలను.
కలువవలె రాజుతోఁ గాంతు విశ్రాంతి.
ఉడుగణములో నొక్క యువిదనై యుందు.
అనుసరింపఁగ నన్ను నాస మీ కున్న,
మర్త్యులీ రమరులై మన నిష్ట మున్న,
మహి వీడి దివిఁ గాంచ మన సింత యున్న,
నిహమందె స్వర్లోక మింద్రభోగంబు
నందుకొనెడునదృష్ట మావంత యున్న,
శీలమే ప్రాణమని చిత్తమున నిడుఁడు !
శీలమే యిల నెందు స్వేచ్ఛావిహారి !
బ్రహ్మాండములు మీఱి పరముఁ దిలకింప
స్వర్గ మందఁగ నేర్పు వరశీల మిచ్చు.
దుర్బలత శీలంబుఁ దూలిపోకున్న
విభుఁ డొక్కఁడుండె ననువిశ్వాస మున్న
గోవువెంటను దగులు కోడెవలె విభుఁడు
వెన్నంటి సర్వదా ప్రియముఁ గల్పించు.
బల మిచ్చు శీలసంపదల నిలఁబెట్టు
ధర్మమే దైవంబు తథ్య మిది సుండి.

ఓం తత్సత్

ఇది శ్రీ షోడశాంత రాజరాజేశ్వరీ కలోపహిత శ్రీ సత్యానందనాథ
గురుప్రసాద లబ్ధ సరసకవితాధురంధర సుజనవిధేయ వాధూలస
గోత్ర పవిత్ర శ్రీ మదాపస్తంబసూత్ర మహాన్నప్రదాత
నారాయణ ప్రపౌత్ర వేంకటచయన పౌత్ర దత్తాత్రేయపుత్ర
అన్నపూర్ణాగర్భశుక్తిముక్తాఫలాయమాన విద్వత్కవి
రాజ, కవికులశేఖర, తంత్రసాహిత్యకలాప్రపూర్ణ
సరిపెల్ల విశ్వనాథశాస్త్రి ప్రణీతంబయిన
కామవిలాసం బను ద్విపదకావ్యము
సమాప్తము.

# అభిప్రాయములు

1. The Hindu

   *" A very successful attempt. "*

2. Sri P. V. Rajamannar,

   *Chief Justice, Madras High Court.*

   *" Style is chaste and pleasing."*

3. Professor M. Venkatarangiah, M. A.

   *" Best classical style of high quality. "*

4. Sri V. Ramasubbarayudu, B. A.

   *A Poet and a Critic.*

   *" Kamavilasam is a master-piece."*

5. *'శిరోమణి, విద్వాన్, బి. ఓ. యల్.'*

   శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

   *" కవి రచనము మృదుమధురము, నిర్దుష్టము "*

6. *'కళాప్రపూర్ణ, కావ్యస్మృతితీర్థ'*

   శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు

   *"కవిత్వాము సమతల ప్రసారిత ప్రోదినీవతంసము కరణి నెగుడు దిగుడులులేక పరుగిడుచున్నది."*

7. *'అభినవ వాగనుశాసన'*

   శ్రీ పండిత మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

   *"స్వకపోలకల్పితముగాఁ గావింపఁబడిన యనువాద గ్రంథ మిప్పటికిదే నాకంటఁ బడినదనుట యతిశయోక్తికాదు. భాషాను వాదకుల కుదాహరణముగా దగియున్నదనుట నిర్వివాదము."*

8. 'ప్రతిభ'

   *"మూలగ్రంథ ప్రసక్తి తలపెట్టకుండావున్న ఈ కామవిలాసము సరసము, సరళము, ఉదాత్తము, మనోరంజకము అన నగును."*